ప్రాణములనువినిమయముచేసి, పాపాత్ములకు పొందశక్యముకాని బ్రహ్మలోకమును పొందుము.

ద్వితీయ :- అనుగృహీతో ఽస్మి । అంబ! అభివాదయే ।

అ॥ అనుగ్రహింపబడితిని. అమ్మా! నమస్కరించుచున్నాను.

బ్రాహ్మణీ :- జాత ! చిరంజీవ ।

అ॥ పుత్రా ! చిరకాలము జీవించుము.

ద్వితీయః- అగృహీతోఽస్మి, ఆర్య! అభివాదయే ।

అ॥ అనుగ్రహించబడితిని. ఆర్యా! నమస్కరించుచున్నాను.

ప్రథమః- ఏహ్యేహి వత్స !

అ॥ వత్సా ! రమ్ము రమ్ము.

22. శ్లో॥ పరిష్వజస్వ గాఢం మాం పరిష్వక్తః శుభైర్గుణైః ।
కీర్త్యా తవ పరిష్వక్తా భవిష్యతి వసుంధరా ।

అ॥ శుభైః = మంగళకరమైన, గుణైః = గుణములతో, పరిష్వక్తః = కౌగిలింపబడినవాడవై, మాం = నన్ను, గాఢం = గాఢముగా, పరిష్వజస్వ = కౌగిలించుకొనుము. వసుంధరా = భూమి, తవ = నీయొక్క, కీర్త్యా = కీర్తిచేత, పరిష్వక్తా = కౌగిలించబడినది, భవిష్యతి = కాగలదు.

తా॥ మంగళకరమైన గుణములతో కౌగిలింపబడిన వాడవై నన్ను కౌగిలించుకొనుము. భూమి నీ కీర్తితో కౌగిలించుకొనబడినది కాగలదు.

ద్వితీయ :- అనుగృహీతోఽస్మి.

అ॥ అనుగ్రహించబడితిని.

బ్రాహ్మణి [illegible]— ఆర్య ! అభివాదయే.

అ॥ ఆర్యా ! నమస్కరించుచున్నాను.

ద్వితీయ :- స్వస్తి.

అ॥ శుభమగుగాక !

తృతీయ :- అనుగృహీతోఽస్మి ।

అ॥ అనుగ్రహింపబడితిని.

ద్వితీయః- భో పురుష! బ్రవీమి కించిత్ ।

అ॥ ఓ పురుషుడా ! కొంచెము చెప్పుచున్నాను.

ఘటోత్కచః- బ్రూహి బ్రూహి శీఘ్రమ్

అ॥ చెప్పుము త్వరగా చెప్పుము.

ద్వితీయః- ఏ తస్మిన్ వనాంతరే జలాశయ ఇవ దృశ్యతే, తత్రామే ప్రకల్పిత పరలోకస్య పిపాసాప్రతీకారం కరిష్యామి.

అ॥ ఏ తస్మిన్ వనాంతరే = ఈ అడవి మధ్యయందు, జలాశయః ఇవ = జలాశయము వలె, దృశ్యతే = కనిపించుచున్నది, తత్ర = అక్కడ, ప్రకల్పిత పరలోకస్య =పరలోకమునకు సంసిద్ధుడనైన, మే = నాకు, పిపాసాప్రతీకారం = దాహశాంతిని, కరిష్యామి = చేసుకొందును.

తా॥ ఈ అడవి మధ్యయందు జలాశయమువలె కనిపించుచున్నది. అక్కడ పరలోకమునకు సంసిద్ధుడనైన నాకు దాహశాంతిని కలిగించుకొందును.

ఘటోత్కచః – దృఢవ్యవసాయిన్! గమ్యతామ్ । అతిక్రామతి మాతురాహారకాలః । శీఘ్ర మాగచ్ఛ ।

అ॥ దృఢ వ్యవసాయిన్ = దృఢమైన నిశ్చయముకలవాడా!, గమ్యతాం = వెళ్ళుము, మాతుః = తల్లికి, ఆహారకాలః = భోజనసమయము, అతిక్రామతి = అతిక్రమించుచున్నది, శీఘ్రం = త్వరగా ఆగచ్ఛ = రమ్ము.

తా॥ దృఢమైన నిశ్చయము కలవాడా! వెళ్ళుము. తల్లికి ఆహారసమయము దాటుచున్నది. త్వరగా రమ్ము.

ద్వితీయః – భో తాత! ఏష గచ్ఛామి ।

అ॥ ఓ తండ్రీ! ఇదిగో పోవుచున్నాను.

(నిష్క్రాంతః) (నిష్క్రమించును)

వృద్ధః – హా హా పరిముషితా స్మో భోః! పరిముషితా స్మః ।

అ॥ హాహా మోసగించబడితిమి. అయ్యో! మోసగించబడితిమి.

23. శ్లో॥ యస్త్రిశృంగో మమ హ్యాసీన్మనోజ్ఞో వంశ పర్వతః
న మధ్యశృంగభంగేన మనస్తపతి మే భృశమ్ ।

అ॥ మనోజ్ఞః = మనోహరమైన, త్రిశృంగః = మూడు శిఖరములు కలిగిన, మమ = నా యొక్క, వంశపర్వతః = వంశమను పర్వతము, యః = ఏది, ఆసీత్ = ఉండెనో, సః = అది, మధ్య శృంగ భంగేన = మధ్యశిఖరము యొక్క నాశనము చేత, మే = నాయొక్క, మనః = మనస్సును, తపతి = బాధించుచున్నది.

తా॥ మనోహరమైన మూడు శిఖరములు గల నావంశమను పర్వతము ఏది యుండెనో, అది మధ్య శిఖరము నాశనమగుటచే నామనస్సును బాధించుచున్నది.

హా పుత్ర కథం గత ఏవ ।

అ॥ హా పుత్రుడా! ఎట్లు పోయితివా ?

24. శ్లో॥ తరుణ! తరుణ తాను రూపకాంతే!
నియతపరాధ్యయన ప్రసక్తబుద్ధే ।
కథమిహ గజరాజ దంతభగ్న –
స్తరురివ యాస్యసి పుష్పితో వినాశమ్ ।

అ॥ తరుణ = చిన్నవాడా !, తరుణ తానురూపకాంతే = యౌవనమునకనుకూలమైన సౌందర్యము కలవాడా!, నియమపర = విధిపూర్వకమైన, అధ్యయన = వేదాధ్యయనమునందు, ప్రసక్తబుద్ధే = లగ్నమైన బుద్ధి కలవాడా !, గజరాజ = గజశ్రేష్ఠము యొక్క, దంత = దంతములంచే, భగ్నః = విరువబడిన, పుష్పితః = పుష్పించిన, తరుఃఇవ = వృక్షమువలె, ఇహ = ఇక్కడ, కథం = ఎట్లు, వినాశం = వినాశమును, యాస్యసి = పొందుచున్నావు.

తా॥ చిన్నవాడా! యౌవనమునకనుకూలమైన సౌందర్యము కలవాడా! విధిపూర్వకమైన

వేదాధ్యయనమునందు లగ్నమైన బుద్ధికలవాడా! గజరాజు యొక్క దంతముంచే విరువబడిన పుష్పించిన వృక్షమువలె యిక్కడ నీవు ఎట్లు వినాశనమును పొందుచున్నావు?

**ఘటోత్కచః – చిరాయతే ఖలు బ్రాహ్మణవటుః । అతిక్రామతి మాతుః రాహారకాలః కిమ్ను ఖలు కరిష్యే । భవతు, దృష్టమ్ । భో బ్రాహ్మణ ! ఆహూయతాం తవ పుత్రః**

**అ।** బ్రాహ్మణవటుః = బ్రాహ్మణ బ్రహ్మచారి, చిరాయతే ఖలు = ఆలస్యము చేయుచున్నాడు కదా!, మాతుః = తల్లియొక్క, ఆహారకాలః = భోజన సమయము, అతిక్రామతి = దాటుచున్నది. కింను ఖలు కరిష్యే = ఏమి చేయవలయును ?, భవతు = కానిమ్ము, దృష్టమ్ = చూడబడినది, భో బ్రాహ్మణ = ఓ బ్రాహ్మణుడా!, తవ = నీ యొక్క పుత్ర = పుత్రుడు, ఆహూయతాం = పిలువబడుగాక !

**తా।** బ్రాహ్మణ బ్రహ్మచారి ఆలస్యము చేయుచున్నాడు కదా! తల్లికి భోజన సమయము దాటుచున్నది. ఏమి చేయవలయును ? ఆ !తెలిసినది. ఓ బ్రాహ్మణుడా! నీ పుత్రుడు పిలువబడుగాక!

**వృద్ధః – ఆః! అతిరాక్షసం ఖలు తే వచనమ్ ।**

**అ।** తే = నీయొక్క, వచనం = మాట, అతి రాక్షసం ఖలు = అతి రాక్షసమైనదికదా!

**తా।** ఆ ! నీమాట అతిరాక్షసమైనది కదా!

(నీ మాట రాక్షసుల మాట కంటె క్రూరమైనదికదా!)

**ఘటోత్కచః – కథం రుష్యతి । మర్షయతు మర్షయతు భవాన్ । అయం మే ప్రకృతి దోషః । అథ కిం నామా తవ పుత్రః ?**

**అ।** కథం = ఎట్లు, రుష్యతి = కోపగించుచున్నాడా?, భవాన్ = నీవు, మర్షయతు = క్షమించెదవుగాక, అయం = ఇది, మే = నాయొక్క ప్రకృతి దోషః = స్వభావదోషము, తవ = నీయొక్క, పుత్రః = పుత్రుడు, కిన్నామా = ఏ నామధేయుడు ?

**తా।** ఎట్లు, కోపగించుచున్నావా? నీవు, క్షమించుము. క్షమించుము. ఇది నా స్వభావదోషము. నీ పుత్రుడు ఏ నామధేయము గలవాడు?

**వృద్ధః – ఏ తదపి శక్యం శ్రోతుమ్ ।**

**అ।** ఇది కూడ వినుటకు శక్యమైనదా ?

**ఘటోత్కచః – యుక్తం భోః ! బ్రాహ్మణ కుమార ! కిన్నామా తే భ్రాతా?**

**అ।** సరియే! ఓ బ్రాహ్మణ కుమారుడా! నీ సోదరుడు ఏ నామధేయుడు?

**ప్రథమః – తపస్వీ మధ్యమః ।**

**అ।** తపస్వి మధ్యముడు ।

**ఘటోత్కచః – మధ్యమ ఇతి సదృశమస్య । అహమేవాహ్వయామి । భోభో మధ్యమ । మధ్యమ । శీఘ్రమాగచ్ఛ ।**

అ। మధ్యమః ఇతి = మధ్యముడు అనునది, అస్య = ఇతనికి, సదృశం = సమానమైనది, అహమేవ = నేనే, ఆహ్వయామి = ఆహ్వానించెదను. భోమధ్యమ = ఓ మధ్యముడా!, శీఘ్రం = త్వరగా, ఆగచ్ఛ = రమ్ము.

తా। మధ్యముడనునది యితనికి సమానమైనది. నేనే పిలిచెదను. ఓఓ మధ్యముడా! మధ్యముడా! త్వరగా రమ్ము !

(తతః ప్రవిశతి భీమసేనః)

(తరువాత భీమసేనుడు ప్రవేశించును)

భీమసేనః – భోః కస్యాయం స్వరః ?

అ। ఈ స్వరము ఎవరిది ?

25. శ్లో।ఖగశతవిరుతే విరౌతి తారం
ద్రుమగహనే దృఢసంకటే వనేఽస్మిన్ ।
జనయతి చ మనోజ్వరం స్వరోఽయం
బహుసదృశో హి ధనంజయస్వరస్య ।

అ। ఖగశత విరుతే = అనేక పక్షుల ధ్వనులతో కూడిన, ద్రుమగహనే = చెట్లతో దట్టమైన, దృఢసంకటే = మిక్కిలి కిక్కిరిసి యున్న, అస్మిన్ వనే = ఈ అడవియందు, అయంస్వరః = ఈ శబ్దము, తారం = బిగ్గరగా, విరౌతి = ధ్వనించుచున్నది, మనోజ్వరంచ = మనస్సునకు బాధను కూడ, జనయతి = కలిగించుచున్నది, ధనంజయ స్వరస్య = అర్జునుని ధ్వనికి, బహుసదృశః- హి = మిక్కిలి సమానమైనది కదా!

తా। అనేక పక్షుల ధ్వనులతో కూడిన చెట్లతో దట్టమైన, మిక్కిలి కిక్కిరిసియున్న ఈ అడవిలో ఈశబ్దము బిగ్గరగా ధ్వనించుచున్నది. మనస్సునకు బాధను కలిగించుచున్నది. అర్జునుని స్వరమునకు మిక్కిలి సమానమైనది కదా !

ఘటోత్కచః – చిరాయతే ఖలు బ్రాహ్మణవటుః । అతిక్రామతి మాతురాహారకాలః కిమ్ను ఖలు కరిష్యే । భవతు, దృష్టమ్ । ఉచ్చైః శబ్దాపయామి । భోభో మధ్యమ । శీఘ్రమాగచ్ఛ.

తా। బ్రాహ్మణ బ్రహ్మచారి ఆలస్యము చేయుచున్నాడు కదా! తల్లికి భోజన సమయము దాటుచున్నది. ఏమి చేయవలయును? ఆ! తెలిసినది. గట్టిగా శబ్దము చేసెదను. ఓ ఓ మధ్యముడా! త్వరగా రమ్ము.

భీమసేనః – భోః కోను ఖల్వేతస్మిన్ వనాంతరే మమ వ్యాయామ విఘ్నము త్పాద్య మధ్యమ మధ్యమ ఇతి మాం శబ్దాపయతి । భవతు పశ్యామస్తావత్ (పరిక్రమ్యావలోక్య) అహో దర్శనీయోఽయం పురుషః । అయం హి –

అ। అస్మిన్ వనాంతరే = ఈ అడవి మధ్యయందు, మమ = నాయొక్క, వ్యాయామవిఘ్నం

= వ్యాయామమునకు భంగమును, ఉత్పాద్య = కలిగించి, మధ్యమః ఇతి = మధ్యముడు అని, కః ను = ఎవడు, మాం = నన్ను, శబ్దాపయతి = పిలుచుచున్నాడు ? భవతు = కానిమ్ము, పశ్యామః తావత్ = చూచెదము (పరిక్రమ్య = వెనుకకు తిరిగి, అవలోక్య = చూచి) ఆహా = ఆహో, అయం పురుషః = ఈ పురుషుడు, దర్శనీయః = చూడదగినవాడు, అయంహి = ఇతడు -

తా॥ ఈ అడవి మధ్యయందు నా వ్యాయామమునకు విఘ్నమును కలిగించి, మధ్యముడు మధ్యముడు అని నన్ను పిలుచుచున్నవాడు ఎవడో కదా! కానిమ్ము, చూచెదను. (వెనుకకు తిరిగి, చూచి) ఆహా! ఈ పురుషుడు చూడదగినవాడు కదా! ఇతడు -

26. శ్లో॥ సింహాస్యః సింహదంష్ట్రో మధునిభనయనః
స్నిగ్ధగంభీరకంఠో
బభ్రుభ్రూః శ్యేననాసో ద్విరదపతి హనుర్దీర్ఘ -
విశ్లిష్టకేశః ।
వ్యూఢోరా వజ్రమధ్యో గజవృషభగతిర్లంబ -
పీనాంసబాహుః
సువ్యక్తం రాక్షసీజో విపులబలయుతో
లోకవీరస్య పుత్రః ।

అ॥ సింహాస్యః = సింహము ముఖమువంటి ముఖము కలవాడు, సింహదంష్ట్రః = సింహముయొక్క దంతముల వంటి దంతములు గలవాడు, మధునిభనయనః = మోహింపజేయు నేత్రములు గలవాడు, స్నిగ్ధగంభీరకంఠః = మనోహరమైన గంభీరమైన కంఠము గలవాడు, బభ్రుభ్రూః = పింగళ వర్ణముగల కనుబొమ్మలు గలవాడు, శ్యేననాసః = డేగ యొక్క ముక్కువంటి ముక్కుగలవాడు, ద్విరదపతిహనుః = గజరాజుయొక్క గండస్థలము వంటి గండస్థలము గలవాడు, దీర్ఘవిశ్లిష్ట కేశః = పొడవైన శిథిలమైన కేశములు గలవాడు, వ్యూఢోరా = విశాలమైన వక్షస్థలము గలవాడు, వజ్రమధ్యః = వజ్రము వంటి నడుము గలవాడు, గజవృషభ గతిః = గజము, వృషభములవంటి నడక కలవాడు, లంబపీనాంసబాహుః = వ్రేలాడుచున్న బలిసిన మూపురములు గల బాహువులు గలవాడు, రాక్షసీజః = రాక్షసస్త్రీకి పుట్టినవాడు, విపుల బలయుతః = విస్తారమైన బలము కలవాడు, లోకవీరస్య = లోకైక వీరునియొక్క, పుత్రః = పుత్రుడు, ఇతి = అని, సువ్యక్తమ్ = స్పష్టముగా తెలియుచున్నది.

తా॥ ఈ పురుషుడు సింహము యొక్క ముఖము వంటి ముఖము కలవాడై, సింహము యొక్క దంతములవంటి దంతములు గలవాడై, మోహింపజేయు నేత్రములు గలవాడై, మనోహరమైన గంభీరమైన కంఠము గలవాడై, పింగళవర్ణము గల కనుబొమలు

గలవాడై, డేగ యొక్క ముక్కువంటి ముక్కుగలవాడై, గజరాజు యొక్క గండస్థలము వంటి గండస్థలము గలవాడై పొడవైన శిథిలమైన కేశములు గలవాడై విశాలమైన వక్షస్థలము గలవాడై, వజ్రము వంటి నడుముగలవాడై, గజము వృషభముం వంటి నడకగల వాడై, వ్రేలాడుచున్న బలిసిన మూపురములు గల బాహువులు గలవాడై, విస్తారమైన బలములో కూడినవాడై రాక్షసస్త్రీకి పుట్టిన వాడని, లోకైక వీరుని పుత్రుడని స్పష్టముగా తెలియుచున్నది.

ఘటోత్కచః – చిరాయతే ఖలు బ్రాహ్మణవటుః । అతిక్రామతి మాతురాహారకాలః ! కి మిదానీం కరిష్యే । భవతు ఉచ్చైరాహ్వానం కరిష్యే । భో భో మధ్యమ ! శీఘ్రమాగచ్ఛ ।

తా॥ బ్రాహ్మణ బ్రహ్మచారి ఆలస్యము చేయుచున్నాడు కదా! తల్లి భోజన సమయము దాటుచున్నది. ఇప్పుడు ఏమి చేయవలయును. కానిమ్ము, గట్టిగా పిలిచెదను. ఓ ఓ మధ్యముడా । త్వరగా రమ్ము.

భీమసేనః – భో! ప్రాప్తోఽస్మి!

తా॥ ఓయీ! వచ్చితిని

ఘటోత్కచః – న ఖల్వయం బ్రాహ్మణవటుః । అహో దర్శనీయోఽయం పురుషః య ఏషః –

తా॥ ఇతడు బ్రాహ్మణ బ్రహ్మచారి కాదుకదా । ఆహా ఇతడు చూడదగినవాడు కదా । ఇతడు –

27. శ్లో॥ సింహాకృతిః కనక తాల సమాన బాహుః –
 మధ్యేతను ర్గరుడ పక్ష విలిప్త పక్షః ।
విష్ణుర్భవే ద్వికసితాంబుజ పత్రనేత్రో
 నేత్రే మమాహరతి బంధురివాగతోఽయమ్ ।

అ॥ సింహాకృతిః = సింహము వంటి ఆకారము గలవాడు, కనక తాల సమాన బాహుః = బంగారపుతాటి వృక్షము వంటి బాహువులు గలవాడు, మధ్యేతనుః = సన్నని నడుము గలవాడు, గరుడ పక్ష విలిప్త పక్షః = గరుత్మంతుని యొక్క రెక్కలవలె సంశ్లిష్టమైన పార్శ్వములు గలవాడు, వికసిత = వికసించిన, అంబుజ పత్ర నేత్రః = తామర రేకులవంటి నేత్రములు గలవాడు, విష్ణుః = విష్ణువై, భవేత్ = ఉండునా ? ఆగతః = వచ్చిన వాడైన, అయం = ఇతడు, బంధుః ఇవ = బంధువు వలె, మమ = నాయొక్క నేత్రే = నేత్రములను, ఆహరతి = ఆకర్షించుచున్నాడు.

తా॥ సింహము వంటి ఆకారముగలవాడై, బంగారపుతాటి వృక్షము వంటి బాహువులు గలవాడై, సన్నని నడుము గలవాడై, గరుత్మంతుని యొక్క రెక్కలవలె సంశ్లిష్టమైన పార్శ్వములు గలవాడై, వికసించిన, తామరరేకుల వంటి నేత్రములు గలవాడై

అతడు విష్ణువై యుండునా ? ఇక్కడకు వచ్చిన యితడు బంధువు వలె నా కన్నులను ఆకర్షించుచున్నాడు.

భో మధ్యమ ! త్వాం ఖల్వహం శబ్దాపయామి.

తా॥ ఓ మధ్యముడా! నిన్నుకదా నేను పిలుచుచున్నది.

భీమసేనః – అతః ఖల్వహంప్రాప్తః ।

తా॥ అందువలన నేను వచ్చితిని కదా ।

ఘటోత్కచః – కిం భవానపి మధ్యమః ।

తా॥ ఏమి నీవుకూడ మధ్యముడవా ?

భీమసేనః – న తావదపరః ।

తా॥ వేరొకడెవడును లేడు.

28. శ్లో ॥మధ్యమోఽహమవధ్యానాముత్సిక్తానాం చ మధ్యమః ।
మధ్యమోఽహం క్షితౌ భద్ర! భ్రాతౄణామపి మధ్యమః ।

అ॥ అవధ్యానాం = చావులేని వారలలో, అహం = నేను, మధ్యమః= మధ్యముడను, ఉత్సిక్తానాం = అభిమానవంతులలో, అహం = నేను, మధ్యమః = మధ్యముడను, క్షితౌ=భూమి యందు, అహం = నేను, మధ్యమః = మధ్యముడను, భ్రాతౄణాం అపి = సోదరులలో కూడ, అహం = నేను, మధ్యమః = మధ్యముడను.

తా॥ చావులేని వారలలో నేను మధ్యముడను. అభిమానవంతులలో నేను మధ్యముడను భూమిపై నేను మధ్యముడను. సోదరులలో కూడ నేను మధ్యముడను.

ఘటోత్కచః – భవితవ్యమ్ ।

తా॥ కావచ్చును.

అపి చ.

అ॥ ఇంతేగాక

29. శ్లో ॥మధ్యమః పంచభూతానాం పార్థివానాం చ మధ్యమః ।
భవే చ మధ్యమో లోకే సర్వకార్యేషు మధ్యమః ।

అ॥ పంచభూతానాం = పంచభూతములలో, మధ్యమః = మధ్యముడను, పార్థివానాం = రాజులలో, మధ్యమః = మధ్యముడను, లోకే = లోకమునందు, భవేచ = పుట్టుకయందు కూడ, మధ్యమః = మధ్యముడను, సర్వకార్యేషు = అన్ని వ్యవహారములయందు, మధ్యమః = మధ్యముడను.

తా॥ పంచభూతములలో మధ్యముడను. రాజులలో మధ్యముడను. లోకమునందు పుట్టుకచేత కూడ మధ్యముడను. సర్వవ్యవహారములందు కూడ మధ్యముడను.

వృద్ధ -

30. శ్లో ॥ మధ్యమస్త్వితి సంప్రోక్తే నూనం పాండవ మధ్యమః ।
అస్మాన్ మోక్తుమిహాయాతో దర్పాన్మృత్యోరివో త్థితః ॥

అ॥ మధ్యమః ఇతి = మధ్యముడు అని, సంప్రోక్తేసతి చెప్పబడినచో, నూనం = నిశ్చయముగా, పాండవమధ్యమః = పాండవ మధ్యముడైన భీముడై యుండును, దర్పాత్ = గర్వమువలన, మృత్యోః = మృత్యువునుండి, అస్మాన్ = మనలను, మోక్తుం = విడిపించుటకు, ఉత్థితః ఇవ = ఉదయించిన వానివలె,ఇహ = ఇక్కడకు, ఆయాతః = వచ్చినవాడు.

తా॥ మధ్యముడని చెప్పబడుటవలన నిశ్చయముగా పాండవ మధ్యముడైన భీముడై యుండును. గర్వమువలన మృత్యువు నుండి మనలను విడిపించుటకు ఉదయించిన వానివలె వచ్చిన వాడయ్యెను.

ద్వితీయః - (ప్రవిశ్య ప్రవేశించి)

31. శ్లో ॥అస్యామాచమ్య పద్మిన్యాం పరలోకేషు దుర్లభమ్ ।
ఆత్మనైవాత్మనో దత్తం పద్మపత్రోజ్జ్వలం జలమ్ ॥

అ॥ అస్యాం పద్మిన్యాం = ఈ పద్మసరస్సునందు, పరలోకేషు = పరలోకములందు, దుర్లభం = లభించని, పద్మపత్ర = తామరాకువలె, ఉజ్జ్వలం = స్వచ్ఛమైన, ఆత్మనా ఏవ = నా చేతనే, ఆత్మనః = నాకు, దత్తం = ఇవ్వబడిన, జలం = నీటిని, ఆచమ్య = త్రాగి,

తా॥ పరలోకములందు లభించని, తామరాకువలె స్వచ్ఛమైన, నాచేతనే నాకు యివ్వబడిన ఈ పద్మసరస్సులోని నీటిని త్రాగితిని.
(ఉపగమ్య = సమీపించి)
భో పురుష ! ప్రాప్తోఽస్మి

తా॥ ఓ పురుషుడా ! వచ్చితిని

ఘటోత్కచః - ప్రాప్తవానిదానీం ఖల్వసి త్వమ్. మధ్యమ ! ఇత ఇతః ।

అ॥ త్వం = నీవు, ఇదానీం = ఇప్పుడు, ప్రాప్తవాన్ = వచ్చినవాడవు, అసి ఖలు = అగుచున్నావు కదా । మధ్యమ = మధ్యముడా!, ఇతఃఇతః = ఇటు ఇటు

తా॥ ఇప్పుడు నీవు వచ్చితివి కదా! మధ్యముడా! ఇటు ఇటు.
వృద్ధః - (భీమముపగమ్య = భీముని సమీపించి)
భో మధ్యమ! పరిత్రాయస్వ బ్రాహ్మణ కులమ్ ।

తా॥ ఓ మధ్యముడా ! బ్రాహ్మణకులమును రక్షింపుము.
భీమసేనః - న భేతవ్యమ్ । మధ్యమోఽహ మభివాదయే ।

అ॥ న భేతవ్యం = భయపడవలదు । అహం = నేను,మధ్యమః = మధ్యముడను, అభివాదయే = నమస్కరించుచున్నాను.

తా॥ భయపడవలదు. నేను మధ్యముడను. నమస్కరించుచున్నాను.

వృద్ధః – వాయురివ దీర్ఘాయు ర్భవ

అ॥ వాయుః ఇవ = వాయువువలె, దీర్ఘాయుః = దీర్ఘాయుస్సు కలవాడవు, భవ = అగుము.

తా॥ వాయువువలె దీర్ఘాయుష్కుడవు కమ్ము.

భీమసేనః – అనుగృహీతోఽస్మి । కుతో భయమార్యస్య ।

తా॥ అనుగ్రహింపబడితిని. పూజనీయునకు భయమెందులకు ?

వృద్ధః – శ్రూయతామ్ – అహం ఖలు కురురాజేన యుధిష్ఠిరేణాధిష్ఠితపూర్వే కురుజాంగలే యూప గ్రామవాస్తవ్యో మాఠరసగోత్రః కల్పశాఖాధ్వర్యుః కేశవ దాసోనామ బ్రాహ్మణః । తస్య మమోత్తరస్యాం దిశ్యుద్యామక గ్రామవాసీ మాతులః కౌశికగోత్రో యజ్ఞబంధుర్నామాస్తి । తస్య పుత్రోపనయనార్థం సకలత్రోఽస్మి ప్రస్థితః ।

అ॥ శ్రూయతామ్ = వినుము, అహం = నేను, కురురాజేన = కురురాజైన, యుధిష్ఠిరేణ = ధర్మరాజుచే, అధిష్ఠిత పూర్వే = పూర్వము పాలింపబడిన, కురుజాంగలే = కురుజాంగలమను దేశమందు, యూపగ్రామ వాస్తవ్యః = యూపగ్రామమందు నివసించువాడను, మాఠరసగోత్రః = మాఠరస గోత్రీయుడను, కల్పశాఖాధ్వర్యుః = కల్పశాఖాధ్వర్యుడను, కేశవదాసఃనామ = కేశవదాసు అను పేరుగల, బ్రాహ్మణః = బ్రాహ్మణుడను, ఉత్తరస్యాం దిశి = ఉత్తరదిక్కునందు, తస్యమమ = ఆ నా యొక్క, మాతులః = మేనమామయైన, ఉద్యామకగ్రామవాసీ = ఉద్యామక గ్రామ వాసి యైన, కౌశికగోత్రః = కౌశిక గోత్రీయుడైన, యజ్ఞ బంధుర్నామా = యజ్ఞబంధువు అనుపేరు గలవాడు, అస్తి = కలడు, తస్య = అతని యొక్క, పుత్రో పనయనార్థం = పుత్రునియొక్క ఉపనయనము కొరకు, సకలత్రః = భార్యతో కూడినవాడనై, ప్రస్థితః = వెళ్ళుచున్నవాడను, అస్మి = అగుచున్నాను.

తా॥ వినుము కురురాజైన ధర్మరాజుచే పూర్వము పాలించబడిన కురుజాంగలమను దేశమందు యూపగ్రామ మందు నివసించువాడను. మాఠరసగోత్రీయుడను. కల్పశాఖా ధ్వర్యుడను. కేశవదాసు అనుపేరుగల బ్రాహ్మణుడను. ఉత్తర దిక్కునందు ఉద్యామక గ్రామ వాసియైన, నామేనమామయైన కౌశిక గోత్రీయుడైన యజ్ఞబంధువు అను బ్రాహ్మణుడు కలడు. అతని పుత్రుని ఉపనయనము కొరకు సపరివారముగా వెళ్ళు చున్నాను.

భీమసేనః– అరిష్టోఽస్తు పంథా । తతస్తతః ।

తా॥ ఏ మార్గము నిర్విఘ్నమగుగాక, తరువాత.
వృద్ధః - తతోమాచేన హి -
తా॥ తరువాత నన్నీతడు -
32. శ్లో॥ సజల జలద గాత్ర ః పద్మపత్రాయతాక్షో
మృగపతి గతిలీలో రాక్షసః ప్రోగ్రదంష్ట్రః।
జగతి విగతశంక స్త్వ ద్విధానాం సమక్షం
ససుతపరిజనం భో ! హంతుకామోఽభ్యుపైతి ।
అ॥ సజల జలదగాత్రః - నీటితో కూడిన మేఘము వంటి శరీరము గలవాడైన, పద్మపత్ర = తామర రేకులవలె, ఆయతాక్ష = విశాలమైన నేత్రములుగల వాడైన, మృగపతి = సింహము యొక్క, గతిలీలః = గమనము వంటి విలాసము గలవాడైన, ప్రోగ్ర దంష్ట్రః = ముందుకు వచ్చిన దంతములు గలవాడైన, జగతి = లోకమందు త్వద్విధానాంఃనీవంటి వారియొక్క, సమక్షం = ఎదుట, విగతశంకః = భయపడనివాడైన, రాక్షసః= రాక్షసుడు, ససుత పరిజనం = భార్యా బిడ్డలతో కూడిన నన్ను, హంతుకామః = చంపవలెననుకోరిక గలవాడై, అభ్యుపైతి = సమీపించుచున్నాడు.
తా॥ నీటితో కూడిన మేఘము వంటి శరీరము గలిగిన వాడైన, తామరరేకుల వంటి విశాలమైన నేత్రములు గల వాడైన, సింహము యొక్క గమనము వంటి విలాసము గలవాడైన, ముందుకు పొడుచుకొచ్చిన దంతములు గలవాడైన, లోకమందు నీవంటివారి ఎదుట భయపడని వాడైన ఈ రాక్షసుడు భార్యాబిడ్డలతో కూడిన నన్ను చంపదలచిన వాడై నన్ను సమీపించుచున్నాడు.
భీమసేనః - ఏవమ్, అనేన బ్రాహ్మణ జనస్య మార్గవిఘ్నః కృతః।
భవతు, విగ్రహీష్యామి తావదేనమ్, భోః పురుష! తిష్ఠ తిష్ఠ।
అ॥ ఏవం = ఇటులనా, అనేన = ఈ రాక్షసుని చేత, బ్రాహ్మణ జనస్య = బ్రాహ్మణుని యొక్క, మార్గవిఘ్నః = మార్గమునకు ఆటంకము, కృతః = చేయబడినదా? భవతు = కానిమ్ము, ఏనం = ఇతనిని, విగ్రహీష్యామి తావత్ = దండించెదను. భోః పురుష = ఓ పురుషుడా! తిష్ఠ = ఆగుము.
తా॥ ఇటులనా? ఇతడు బ్రాహ్మణుని మార్గమును ఆటంకపరచుచున్నాడా? కానిమ్ము, ఇతనిని దండించెదను. ఓ పురుషుడా ! ఆగుము. ఆగుము.
ఘటోత్కచః - ఏష స్థితోఽస్మి.
తా॥ ఇదిగో నిలబడితిని.
భీమసేనః - కిమిర్థం బ్రాహ్మణ జనమపరాధ్యసి
తా॥ నీవు బ్రాహ్మణునకు ఏల కష్టపెట్టుచున్నావు?

33. శ్లో॥ పుత్ర నక్షత్ర కీర్ణస్య పత్నీకాంత ప్రభస్యచ ।
వృద్ధస్య విప్రచంద్రస్య భవాన్ రాహు రివాగతః ।

అ॥ పుత్ర నక్షత్ర కీర్ణస్య = పుత్రులను నక్షత్రములచే చుట్టబడిన, పత్నీకాంత ప్రభస్య = భార్యయను అందమైన కాంతిగల, వృద్ధస్య = వృద్ధుడైన, విప్రచంద్రస్య = బ్రాహ్మణుడను చంద్రునకు, భవాన్ = నీవు, రాహుః ఇవ = రాహువు వలె, ఆగతః = వచ్చితివి..

తా॥ పుత్రులను నక్షత్రములతో కూడిన, భార్యయను అందమైన కాంతి గలిగిన, వృద్ధుడైన, బ్రాహ్మణుడు అను చంద్రునకు నీవు రాహువువలె వచ్చితివి.

ఘటోత్కచః – అథకిమ్ । రాహురేవ ।

తా॥ అవును ఏమి? నేను రాహువునే.

భీమసేనః – ఆః

ఆహా !

34. శ్లో॥ నివృత్త వ్యవహారోఽయం సదారస్తనయైః సహ ।
సర్వాపరాధేఽవధ్యత్వా న్ముచ్యతాం ద్విజ సత్తమః ।

అ॥ నివృత్తవ్యవహారః = పూర్తిచేయబడిన వ్యవహారము గల వాడైన, సదారః = భార్యతో కూడిన వాడైన, అయం ద్విజసత్తమః = ఈ బ్రాహ్మణోత్తముడు, తనయైః సహ = పుత్రులతో కూడ, సర్వాపరాధే = సర్వాపరాధములయందు, అవధ్యత్వాత్ = చంపదగనివాడగుట వలన, ముచ్యతాం = విడువబడుగాక

తా॥ వ్యవహారమును నిర్వర్తించినవాడైన, భార్యతో కూడిన వాడైన, ఈ బ్రాహ్మణోత్తముడు పుత్రులతో కూడ సర్వాపరాధములందు చంపదగని వాడగుట వలన విడువబడుగాక!

ఘటోత్కచః – న ముచ్యతే

తా॥ విడువబడుటలేదు.

భీమసేనః – (ఆత్మగతమ్ = తనలో) భోః కస్య పుత్రేణానేన భవితవ్యమ్.

తా॥ ఓహో! ఇతడు ఎవని పుత్రుడై యుండును.

35. శ్లో॥ భ్రాతౄణాం మమ సర్వేషాం కోఽయం భో గుణతస్కరః ।
దృష్ట్వైతద్బాల శౌండీర్యం సౌభద్రస్య స్మరామ్యహమ్ ।

అ॥ మమ = నాయొక్క, సర్వేషాం భ్రాతౄణాం= సోదరులందరియొక్క, గుణతస్కరః = గుణములను దొంగిలించిన వాడైన, అయం = ఇతడు, కః = ఎవడు?, ఏతత్ బాల శౌండీర్యం = ఈ బాల పరాక్రమమును, దృష్ట్వా = చూచి, అహం = నేను, సౌభద్రస్య = అభిమన్యుని, స్మరామి = తలంచుచున్నాను.

తా॥ నా సోదరులందరియొక్క గుణములను దొంగలించిన వాడైన యితడు ఎవడు? ఇతని బాలపరాక్రమమును చూచి, నేను అభిమన్యునిస్మరణకు తెచ్చుకొనుచున్నాను.

(ప్రకాశమ్ = వెల్లడిగా) భోః పురుష ! ముచ్యతామ్ ।

తా॥ ఓ పురుషుడా ! విడువుము.

ఘటోత్కచః – న ముచ్యతే

తా॥ విడువబడడు.

36\. శ్లో॥ ముచ్యతామితి విస్రబ్ధం బ్రవీతి యది మే పితా ।
న ముచ్యతే తథాహ్యేష గృహీతో మాతురాజ్ఞయా ।

అ॥ మే = నాయొక్క, పితా = తండ్రి, విస్రబ్ధం = విశ్వాస పూర్వకముగా, ముచ్యతాం ఇతి = విడువుము అని, బ్రవీతి యది = చెప్పినను, నముచ్యతే = విడువబడడు, ఏష = ఇతడు, మమ = నాయొక్క, మాతుః = తల్లియొక్క, ఆజ్ఞయా = ఆదేశముచే, గృహీతః హి = పట్టుకొనబడినవాడుకదా !

తా॥ నాతండ్రి విశ్వాస పూర్వకముగా విడువుము అని చెప్పినను నేను విడువను. నాతల్లి యొక్క ఆదేశమునననుసరించి నేను యితనిని పట్టుకొంటిని గదా!

భీమసేనః – (ఆత్మగతమ్ = తనలో) కథం మాతురాజ్ఞేతి । అహో గురు శుశ్రూషః ఖల్వయం తపస్వీ ।

అ॥ కథం = ఎట్లు, మాతుః = తల్లియొక్క, ఆజ్ఞా = ఆదేశమా? అహో = ఆహా, అయం తపస్వీ = ఈ తాపసి, గురుశుశ్రూషః ఖలు = పెద్దలను సేవించువాడు గదా !

తా॥ తల్లి ఆదేశమా ! ఆహా ! ఈ తపస్వి పెద్దలను సేవించువాడుగదా!

37\. శ్లో ॥ మాతా కిల మనుష్యాణాం దైవతానాం చ దైవతమ్ ।
మాతురాజ్ఞాం పురస్కృత్య వయమేతాం దశాం గతాః ।

అ॥ మాతా = తల్లి, మనుష్యాణాం = మానవులకు, దైవతానాంచ = దేవతలకు కూడా, దైవతంకిల = దైవము కదా! మాతుః = తల్లి యొక్క, ఆజ్ఞాం = ఆదేశమును, పురస్కృత్య= అనుసరించి, వయం = మేము, ఏతాందశాం = ఈ స్థితిని, గతాః = పొందితిమి.

తా॥ తల్లి మానవులకు దేవతలకు కూడా దైవము కదా ! మేము తల్లియొక్క ఆదేశముననుసరించి యీ స్థితిని పొందితిమి.

(ప్రకాశమ్ = వెల్లడిగా) భో, పురుష! ప్రష్టవ్యంఖలు తావదస్తి

తా॥ ఓ పురుషుడా! అడుగవలసిన దున్నదికదా!

ఘటోత్కచః – బ్రూహి బ్రూహి శీఘ్రమ్

తా॥ అడుగుము త్వరగా అడుగుము.

భీమసేనః – కా నామ భవతో మాతా?

తా॥ నీతల్లి పేరేమిటి ?

ఘటోత్కచః – శ్రూయతామ్, హిడింబా నామ రాక్షసీ ।

తా॥ వినుము, 'హిడింబ' అను రాక్షసి.

38.శ్లో కౌరవ్యకులదీపేన పాండవేన మహాత్మనా ।
సనాథా యా మహాభాగా పూర్ణేన ద్యౌరివాత్మనా ।
అ। కౌరవ్యకులందీపేన = కౌరవుల వంశమునకు దీపము వంటి వాడైన, మహాత్మనా = గొప్పవాడైన, పాండవేన = భీమసేనునిచే, పూర్ణేన = పరిపూర్ణుడైన, ఇందునా = చంద్రునిచే, ద్యౌః ఇవ = ఆకాశము వలె, యా మహాభాగా = ఏ అదృష్టవంతురాలు, సనాథా = భర్తకలదియో,
తా। ఏ అదృష్టవంతురాలు కౌరవుల వంశమునకు దీపము వంటివాడైన, గొప్పవాడైన, భీమసేనునిచే పరిపూర్ణుడైన చంద్రునిచే ఆకాశమువలె నాథుడు కలిగినది అయ్యెనో, ఆమెయే నాతల్లి.
భీమసేనః – (ఆత్మగతమ్) ఏవం – హిడింబాయాః పుత్రోఽయమ్ సదృశో హ్యస్య గర్వః
అ। (తనలో) అయం = ఇతడు, ఏవం = ఈవిధముగా, హిడింబాయాః = హిడింబయొక్క, పుత్రః = పుత్రుడా ! అస్య = ఇతనియొక్క గర్వః = గర్వము, సదృశః హి = తగినదియే కదా !
తా। (తనలో) ఇతడు హిడింబ తనయుడా ! ఇతనికి గర్వము తగినదియే గదా!
39.శ్లో రూపం సత్త్వం బలం చైవ పితృభిః సదృశం బహు ।
ప్రజాసు వీతకారుణ్యం మనస్త్వస్య కీదృశమ్ ।
అ। రూపం = రూపము, సత్త్వం = పరాక్రమము, బలం = బలము, పితృభిః = తండ్రులతో, బహుసదృశం = మిక్కిలి పోలియున్నది, ప్రజాసు = ప్రజలయందు, వీతకారుణ్యం = దయలేనిదైన, మనః = మనస్సు, అస్య = ఇతనికి, కీదృశమ్ = ఎవరిది?
తా। రూపము, పరాక్రమము, బలము తండ్రులతో మిక్కిలి సమానమైనది. కాని ప్రజలయందు దయలేని యితని మనస్సు ఎవరిని పోలినది ?
(ప్రకాశమ్) భోఃపురుష ! ముచ్యతామ్ ।
తా। (వెల్లడిగా) ఓ పురుషుడా । విడువుము.
ఘటోత్కచః – నముచ్యతే.
తా। విడువబడడు.
భీమసేనః – భో బ్రాహ్మణ ! గృహ్యతాం తవ పుత్రః । వయమేవ మనుగమిష్యామః
అ। భో బ్రాహ్మణ = ఓ బ్రాహ్మణుడా ! తవ = నీయొక్క, పుత్రః = పుత్రుడు, గృహ్యతాం= స్వీకరించబడుగాక, వయం = మేము, ఏనం = ఇతనిని, అనుగమిష్యామః= అనుసరించగలము.
తా। ఓ బ్రాహ్మణుడా! నీ పుత్రుని తీసుకొనుము. మేము యితనిని అనుసరించగలము.
ద్వితీయః– మా మా భవానేవమ్

తా। వలదు ఇట్లు మీరువలదు.

40.శ్లో త్యక్తా ప్రాగేవ మే ప్రాణా గురు ప్రాణేష్వపేక్షయా।
యువా రూపగుణోపేతో భవాంస్తిష్ఠతు భూతలే।

అ। గురుప్రాణేషు = పెద్దలప్రాణములయందు, అపేక్షయా = కాపాడుటచేత, మే = నాయొక్క, ప్రాణాః = ప్రాణములు, ప్రాగేవ = పూర్వమే, త్యక్తాః = వదలబడినవి, యువా = యువకుడవైన, రూపగుణోపేతః = రూపములోను, గుణములోను కూడిన వాడవైన, భవాన్ = నీవు, భూతలే = భూతలమునందు, తిష్ఠతు = ఉండెదవుగాక!

తా। పెద్దల ప్రాణములను కాపాడుటకు నాప్రాణములు యిదివరకే విడువబడినవి. యువకుడవైన, రూపములోను గుణములతోను కూడిన వాడవైన నీవు భూతలము యందుండుము.

భీమసేనః – ఆర్య! మా మైవమ్ క్షత్రియకులోత్పన్నోఽ హమ్।
పూజ్యతమాః ఖలు బ్రాహ్మణాః। తస్మా న్మ చ్ఛరీరేణ
బ్రాహ్మణ శరీరం వినిమాతు మిచ్ఛామి.

అ। ఆర్య=ఆర్యుడా! మా మా ఏవమ్= ఇట్లువలదు, అహం=నేను, క్షత్రియకులోత్పన్నః= క్షత్రియకులమందు పుట్టినవాడను, బ్రాహ్మణాః =బ్రాహ్మణులు, పూజ్యతమాః ఖలు= మిక్కిలి పూజనీయులు కదా! తస్మాత్ =అందువలన, మచ్ఛరీరేణ = నాశరీరము చేత, బ్రాహ్మణశరీరం = బ్రాహ్మణులయొక్క శరీరమును, వినిమాతుం= వినిమయము చేయుటకు ఇచ్ఛామి = ఇష్టపడుచున్నాను.

తా। ఆర్యుడా ! వలదు యిట్లు వలదు. నేను క్షత్రియ కులమందు పుట్టినవాడను. బ్రాహ్మణులు మిక్కిలి పూజింపదగినవారు కదా ! అందువలన నా శరీరముచే బ్రాహ్మణశరీరమును వినిమయము చేయుటకు యిష్టపడుచున్నాను.

ఘటోత్కచ ఒ. ఏవం,క్షత్రియోఽయమ్ తేనాస్య గర్వః భవతు
ఇమమేవ హత్వా నేష్యామి। అథ కేనాయం వారితః?

అ। ఏవం = ఇటులనా? అయం = ఇతడు, క్షత్రియః = క్షత్రియుడా? తేన=అందుచేత, అస్య = ఇతనికి,గర్వః = గర్వము,భవతు = కానిమ్ము, ఇమంఏవ = ఇతనినే, హత్వా= చంపి, నేష్యామి = తీసుకొని వెళ్ళగలను, అయం = ఇతడు, కేన = ఎవనిచేత, వారితః= వారింపబడినాడు.

తా। ఇటులనా ? ఇతడు క్షత్రియుడా ? అందుచేత ఇతనికి గర్వము. కానిమ్ము, ఇతనినే చంపి తీసుకొని వెళ్ళగలను. ఎవనిచే యితడు వారించబడినది?

భీమసేనః – మయా!

తా। నాచేత,

ఘటోత్కచః కిం త్వయా?

తా। ఏమి, నీచేతనా ?

భీమసేనః – అథ కిమ్ ?

తా। అవును ఏమి?

ఘటోత్కచః – తేన హి భవానేవాగచ్ఛతు

తా। అయినచో నీవే రమ్ము

భీమసేనః – ఏవమ్, అతివీర్యబలః నాను గచ్ఛామి। యది తే శక్తి రస్తి, బలాత్కారేణ మాం నయ।

అ। అతివీర్యబలః = మిక్కిలి పరాక్రమము బలము గలవాడను, న అనుగచ్ఛామి = అనుసరించను, తే = నీకు, శక్తిః = శక్తి, అస్తియది = ఉన్నచో, బలాత్కారేణ = బలాత్కారముగా, మాం = నన్ను, నయ = తీసుకొని వెళ్ళుము.

తా। నేను మిక్కిలి బలపరాక్రమములు గలవాడను. నిన్ను అనుసరించను. నీకు శక్తి యున్నచో బలాత్కారముగా తీసుకొని వెళ్ళుము.

ఘటోత్కచః – కిం మాం ప్రత్యభిజానీతే భవాన్ ?

తా। ఏమి నీవు నన్ను ఎరుంగుదువా ?

భీమసేనః – మత్పుత్ర ఇతి జానే.

తా। నాపుత్రుడవని ఎరుంగుదును.

ఘటోత్కచః – కథం కథం తవ పుత్రోఽహమ్।

తా। ఎట్లు ఎట్లు నేను నీ పుత్రుడనా ?

భీమసేనః – కథం రుష్యతి, మర్షయతు భవాన్। సర్వాః ప్రజాః క్షత్రియాణాం పుత్ర శబ్దేనాభిధీయంతే। అత ఏవం మయాభిహితమ్।

అ। కథం = ఎట్లు, రుష్యతి = కోపగించు చున్నావా ? భవాన్ = నీవు, మర్షయతు = మన్నించెదవుగాక, సర్వాః ప్రజాః = సమస్త ప్రజలు, క్షత్రియాణాం = క్షత్రియులకు, పుత్రశబ్దేన = పుత్ర శబ్దముతో, అభిధీయంతే = చెప్పబడుచున్నారు, అతః = అందువలన, మయా = నా చేత, ఏవం = ఈ విధముగా, అభిహితమ్ = చెప్పబడినది.

తా। ఎట్లు కోపగించు చున్నావా ? నీవు క్షమించెదవుగాక! సమస్త ప్రజలు క్షత్రియులకు పుత్రశబ్దముతో చెప్పబడు చున్నారు. అందువలన నేనిట్లు పలికితిని.

ఘటోత్కచః। భీతానామాయుధం గృహీతమ్।

తా। పిరికి వారి ఆయుధమును గ్రహించితివి.

41.శ్లో॥ శపామి సత్యేన భయం న జానే
జ్ఞాతుం తదిచ్ఛామి భవత్సమీపే ।
కిం రూప మేతద్ వద భద్ర ! తస్య
గుణాగుణజ్ఞ సదృశం ప్రపత్స్యే ।

అ॥ సత్యేన = సత్యము చేత, శపామి = శపథము చేయుచున్నాను, భయం = భయమును, నజానే = ఎరుంగను, భవత్సమీపే = నీవద్ద, తత్ = దానిని, జ్ఞాతుం = తెలుసుకొనుటకు, ఇచ్ఛామి = ఇష్టపడుచున్నాను, భద్ర = ఓ పురుషుడా ! ఏతత్ = ఇది, కింరూపం= ఏరూపము కలదో, వద = చెప్పుము, తస్య = దానియొక్క, గుణాగుణజ్ఞ! = గుణాగుణములు తెలిసిన వాడనై, సదృశం = తగిన దానిని, ప్రపత్స్యే= ఆశ్రయించ గలను.

తా॥ సత్యము చెప్పుచున్నాను. నేను భయము నెరుంగను. నీవద్ద దానిని తెలుసుకొనుటకు యిష్టపడుచున్నాను. భద్రా ! అది ఏ రూపముకలిగినదో చెప్పుము. దానియొక్క గుణాగుణముల నెరింగిన వాడనై తగిన దానిని ఆశ్రయించగలను.

ఘటోత్కచః – ఏష తే భయముపదిశామి,గృహ్యతా మాయు ధమ్ –

అ॥ ఏషః = నేను, తే = నీకు, భయం = భయమును, ఉపదిశామి = ఉపదేశించెదను, ఆయుధం = ఆయుధము, గృహ్యతామ్ = తీసుకొనబడునుగాక !

తా॥ నేను నీకు భయము నుపదేశించెదను, ఆయుధమును తీసుకొనుము.

భీమసేనః – ఆయుధమితి । గృహీత మేతత్ ।

తా॥ ఆయుధమా ? దీనిని తీసుకొంటిని.

ఘటోత్కచః – కథమివ ?

తా॥ అది ఎట్లు ?

భీమసేనః



42.శ్లో॥ కాంచన స్తంభసదృశో రిపూణాం విగ్రహే రతః ।
అయం తు దక్షిణో బాహురాయుధం సహజం మమ ।

అ॥ కాంచనస్తంభ సదృశం = బంగార స్తంభముతో సమానమైనది. రిపూణాం = శత్రువుల యొక్క, విగ్రహే = అణచుటయందు, రతః = ఆసక్తిగలిగినదైన, మే = నాయొక్క, అయం దక్షిణః బాహుః = ఈ కుడిభుజము, సహజం = సహజమైన, ఆయుధం= ఆయుధము.

తా॥ బంగారు స్తంభములో సమానమైన, శత్రువులను అణచుటయందాసక్తి కలిగిన, ఈ కుడిభుజము నాకు సహజమైన ఆయుధము.

ఘటోత్కచః – ఇదమువపన్నం పితుర్మే భీమసేనస్య ।

అ। ఇదం = ఈ మాట, మే = నా యొక్క, పితుః = తండ్రియైన, భీమసేనస్య = భీమసేనునకు, ఉపపన్నం = సమ్మతమైనది.

తా। ఈమాట నా తండ్రియైన భీమసేనునకు తగినది.

**భీమసేనః – అథకో౽యం భీమో నామ ?**

తా। ఎవరా భీముడు ?

**43.శ్లో విశ్వకర్తా శివః కృష్ణః శక్రః శక్తిధరో యమః ।**
**ఏతేషు కథ్యతాం భద్ర! కేన తే సదృశః పితా ।**

అ। విశ్వకర్తా = బ్రహ్మయా ?, శివః = శివుడా ?, కృష్ణః = కృష్ణుడా? శక్రః = ఇంద్రుడా? శక్తిధరః = శక్త్యాయుధమును ధరించినవాడైన, యమః = యముడా ? భద్ర = భద్రుడా!, ఏతేషు = వీరిలో, తే = నీయొక్క, పితా = తండ్రి, కేన = ఎవనితో, సదృశః= సమానుడు ?

తా। భద్రుడా! నీ తండ్రి విశ్వకర్తయైన బ్రహ్మయా ? శివుడా ? కృష్ణుడా ? ఇంద్రుడా? శక్త్యాయుధమును ధరించిన యముడా ? వీరిలో నీ తండ్రి ఎవనితో సమానుడు ?

**ఘటోత్కచః – సర్వైః**

తా। అందరితో

**భీమసేనః – ధిగనృత మేతత్**

తా। ధిక్ ఇది అసత్యము

**ఘటోత్కచః – కథం కథమనృత మిత్యాహ । క్షిపతి మే గురుమ్ । భవతు, ఇమం స్థూలం వృక్షము త్పాట్య ప్రహరామి । ( ఉత్పాట్య ప్రహరతి) కథమనేనాపి న శక్యతే హంతుమ్ । కిన్ను ఖలు కరిష్యే । భవతు, దృష్టమ్ । ఏతత్ గిరికూటముత్పాట్య ప్రహరామి ।**

అ। కథం = ఎట్లు, అనృతం ఇతి = అసత్యమని, ఆహ = చెప్పుచున్నావు ?, మే = నాయొక్క, గురుం = తండ్రిని, క్షిపతి = నిందించుచున్నావా ?, భవతు = కానిమ్ము, ఇమం = ఈ, స్థూలం = బరువైన, వృక్షం = వృక్షమును, ఉత్పాట్య = పెకలించి, ప్రహరామి = కొట్టెదను. కథం = ఎట్లు, అనేన అపి = దీనిచేతకూడ హంతుం = చంపుటకు, న శక్యతే = శక్యమగుట లేదు, కింను ఖలు = ఏమి, కరిష్యే = చేయవలయును, భవతు = కానిమ్ము, దృష్టం = తెలిసినది, ఏతత్ గిరికూటం = ఈ పర్వత శిఖరమును, ఉత్పాట్య = పెకలించి, ప్రహరామి = కొట్టెదను.

తా। ఎట్లు అసత్యమనుచున్నావు ? నా తండ్రిని నిందించు చున్నావా? కానిమ్ము, బరువైన ఈ వృక్షమును పెకలించి కొట్టెదను (పెకలించి, కొట్టును). ఎట్లు, దీనిచేత కూడ చంపుటకు శక్యమగుటలేదా ? ఏమి చేయవలయును ? ఆ, తెలిసినది. ఈ పర్వత శిఖరమును పెకలించి కొట్టెదను.

44.శ్లో శైలకూటం మయాక్షిప్తం ప్రాణానాదాయ యాస్యతి ।

అ। మయా = నా చేత, శైలకూటం = పర్వత శిఖరము, క్షిప్తం = విసరబడినది. ప్రాణాన్ = ప్రాణములను, ఆదాయ = తీసుకొని, యాస్యతి = వెళ్ళగలదు.

తా। నా చేత విసరబడిన పర్వతశిఖరము ప్రాణములను తీసుకొని వెళ్ళగలదు.

47.శ్లో భీమసేనః రుష్టోఽపి కుంజరో వన్యోన వ్యాఘ్రం ధర్షయేద్వనే ।

అ। వన్యః = అడవిలో పుట్టిన, కుంజరః = ఏనుగు, రుష్టః అపి = కోపగించినదైనప్పటికి, వనే = అడవియందు, వ్యాఘ్రం = పెద్దపులిని, న ధర్షయేత్ = ఎదిరించలేదు.

తా। అడవిలో పుట్టిన ఏనుగు కోపగించినదైనప్పటికి, అడవియందు పెద్దపులిని ఎదిరించదు.

ఘటోత్కచః (ప్రహృత్య) కథమనేనాపి నశక్యతే హంతుమ్ ।

కిం ను ఖలు కరిష్యే, భవతు, దృష్టమ్ ।

తా। (కొట్టి) ఎట్లు దీనిచేత కూడ చంపుటకు శక్యమగుట లేదు. ఏమి చేయవలయును, ఆ, తెలిసినది.

45.శ్లో నన్వహం భీమసేనస్య పుత్రః పౌత్రో నభస్వతః ।

తిష్ఠేదానీం సుసన్నద్ధో నియుద్ధే నాస్తి మత్సమః ।

అ। అహం = నేను, భీమసేనస్య = భీమునియొక్క, పుత్రః = పుత్రుడను, నభస్వతః = వాయువుయొక్క, పౌత్రః = మనుమడను, ఇదానీం = ఇప్పుడు, సుసన్నద్ధః = బాగా సన్నద్ధుడవై, తిష్ఠ = ఉండుము, నియుద్ధే = బాహు యుద్ధము నందు, మత్సమః = నాతో సమానుడు, నాస్తి = లేడు.

తా। నేను భీమసేనుని పుత్రుడను, వాయువు యొక్క పౌత్రుడను. ఇప్పుడు బాగా సంసిద్ధుడవై యుండుము. బాహు యుద్ధమునందు నాతో సమానుడు లేడు.

(ఇత్యుభౌ నియుద్ధం కురుతః)

(అని ఇరువురు మల్లయుద్ధము చేయుదురు)

ఘటోత్కచః – (భీమసేనం బద్ధ్వా)

(భీమసేనుని బంధించి)

46.శ్లో (i) వ్రజసి కథమిహ త్వం వీర్యముల్లంఘ్య బాహ్వోః

గజ ఇవ దృఢపాశైః పీడితో మద్భుజాభ్యామ్ ।

అ। త్వం = నీవు, బాహ్వోః = బాహువుల యొక్క, వీర్యం = పరాక్రమమును, ఉల్లంఘ్య = తిరస్కరించి, దృఢపాశైః = గట్టి త్రాళ్ళచేత, పీడితః = బంధింపబడిన, గజః ఇవ = ఏనుగువలె, మద్భుజాభ్యాం = నా బాహువులచే, పీడితః = బంధింపబడిన వాడవై, ఇహ = ఇక్కడ, కథం = ఎట్లు, వ్రజసి = వెళ్ళగలవు ?

తా॥ నీవు నా బాహు పరాక్రమమును తిరస్కరించి, గట్టి తాళ్ళచేత బంధింపబడిన ఏనుగువలె నా బాహువులచే బంధింపబడినవాడవై యిక్కడ ఎట్లు వెళ్ళగలవు ?
భీమసేనః – (ఆత్మగతమ్) కథం గృహీతోఽస్మ్యనేన। భోః సుయోధన ! వర్ధతే ఖలు శత్రుపక్ష। కృతరక్షోభవ। (ప్రకాశమ్) భోః పురుష! అవహి తో భవ।
అ॥ కథం = ఎట్లు, అనేన = ఇతనిచేత, గృహీతః = పట్టుకొనబడినవాడను, అస్మి = అగుచున్నాను, భోః - సుయోధన = ఓ దుర్యోధనుడా!, శత్రుపక్ష = శత్రుపక్షము, వర్ధతేఖలు = వృద్ధిపొందుచున్నది కదా! కృతరక్షః = రక్షించుకొనువాడవు, భవ = అగుము, భోః పురుష = ఓ పురుషుడా!, అవహితః = సంసిద్ధుడవు, భవ = అగుము.
తా॥ (తనలో) ఎట్లు ఇతనిచే బంధింపబడితిని. ఓ సుయోధనుడా! నీ శత్రుపక్షము వృద్ధిచెందుచున్నది కదా! రక్షించుకొనువాడవు కమ్ము (వెల్లడిగా) ఓ పురుషుడా! సంసిద్ధుడవు కమ్ము.
ఘటోత్కచః – అవహితోఽస్మి
తా॥ సంసిద్ధుడనగుచున్నాను.
భీమసేనః –(నియుద్ధ బంధమవధూయ)
(బాహుబంధమును వదిలించుకొని)
46.శ్లో॥ (ii) వ్యపనయ బలదర్పం దృష్టసారోఽసి వీర!
న హి మమ పరిభేదో విద్యతే బాహుయుద్ధే ।
అ॥ వీర = వీరుడా! బలదర్పం = బలగర్వమును, వ్యపనయ = విడువుము, దృష్టసారః= నీ శక్తిని, పరిశీలించినవాడవు, అసి = అగుచున్నావు, బాహుయుద్ధే = మల్లయుద్ధమునందు, మమ = నాకు, పరిభేదః = అలసట, నాస్తి హి = లేదు కదా!
తా॥ ఓ వీరుడా! బలగర్వమును విడువుము. నీ శక్తిని పరిశీలించుకొంటిని. మల్లయుద్ధము నందు నాకు అలసట లేదు కదా!
ఘటోత్కచః – కథమనేనాపి న శక్యతే హంతుమ్ । కిన్నుఖలు కరిష్యే? భవతు, దృష్టమ్। అస్తి మాతృప్రసాదలబ్ధో మాయాపాశః। తేన బద్ధ్వైనం నేష్యామి। కుతః ఖల్వాపః? భోగిరే ! ఆపస్తావత్ । హంత, స్రవతి । (ఆచమ్య మంత్రం జపతి) భోః పురుష!
అ॥ మాతృప్రసాదలబ్ధః = తల్లి అనుగ్రహముచే లభించిన, మాయాపాశః = మాయాపాశము, అస్తి = కలదు, తేన = దానిచేత, బద్ధ్వా = బంధించి, ఏనం = ఇతనిని, నేష్యామి = తీసుకొని వెళ్ళెదను, కుతః ఖలు ఆపః = నీరు ఎచ్చట ? భోగిరే! = ఓ పర్వతమా!, ఆపస్తావత్ = నీరుకావలెను, హంత = ఆహా, స్రవతి = స్రవించుచున్నది.
(ఆచమ్య = ఆచమనము చేసి, మంత్రం = మంత్రమును, జపతి = జపించును)
తా॥ ఎట్లు దీనిచేత కూడ చంపుటకు శక్యము కాలేదు. ఏమి చేయవలయును ? ఆ, తెలిసినది. తల్లి యనుగ్రహముచే లభించిన మాయాపాశము కలదు. దానిచేత

యితనిని బంధించి, తీసుకొని వెళ్ళెదను. నీరు ఎచ్చట ? ఓ పర్వతమా! నీరు కావలెను. ఆహా నీరు స్రవించు చున్నది. (ఆచమనము చేసి, మంత్రమును జపించును) ఓ పురుషుడా!

47.శ్లో॥ మాయాపాశేన బద్ధస్త్వం వివశోఽను గమిష్యసి ।
రాజసే రజ్జుభిర్బద్ధః శక్రధ్వజ ఇవోత్సవే ।

అ॥ మాయాపాశేన = మాయాపాశముచే, బద్ధః = బంధింపబడిన, త్వం = నీవు, వివశః = వివశుడవై, అనుగమిష్యసి = అనుసరించెదవు, రజ్జుభిః = త్రాళ్ళచేత, బద్ధః = బంధింపబడిన, ఉత్సవే = ఉత్సవమునందు, శక్రధ్వజః ఇవ = ఇంద్రధ్వజము వలె, రాజసే = ప్రకాశించుచున్నావు.

తా॥ మాయాపాశముచే బంధింపబడిన నీవు వివశుడవై నన్ననుసరించెదవు. త్రాళ్ళచే బంధింపబడిన ఉత్సవమునందు ఇంద్ర ధ్వజమువలె ప్రకాశించుచున్నావు.

**(ఇతి మాయయా బధ్నాతి)**

(అని మాయతో బంధించును)

**భీమసేనః – కథం మాయాపాశేన బద్ధోఽస్మి । కిమిదానీం కరిష్యే । భవతు, దృష్టమ్ అస్తి మహేశ్వరప్రసాదలబ్ధో మాయా పాశమోక్షో మంత్రః । తం జపామి । కుతః ఖల్వాపః? భో బ్రాహ్మణకుమార ! ఆనయ కమండలుగతా ఆపః ।**

అ॥ కథం = ఎట్లు, మాయాపాశేన = మాయాపాశముచే, బద్ధః = బంధింపబడినవాడను, అస్మి = అగుచున్నాను. ఇదానీం = ఇప్పుడు, కిం = ఏమి, కరిష్యే = చేయవలయును? భవతు = కానిమ్ము, దృష్టమ్ = చూడబడినది, మహేశ్వర ప్రసాదలబ్ధః = మహేశ్వరుని అనుగ్రహముచే లభించిన, మాయాపాశమోక్షః = మాయాపాశమోక్షము అను, మంత్రః = మంత్రము, అస్తి = కలదు, తం = దానిని, జపామి = జపించెదను, కుతఃఖలు ఆపః = నీరు ఎచ్చట ? భోః బ్రాహ్మణ కుమార = ఓ బ్రాహ్మణకుమారుడా!, కమండలుగతాః = కమండలములోయున్న, ఆపః = నీటిని, ఆనయ = తీసుకొనిరమ్ము.

తా॥ ఎట్లు మాయాపాశముచే బంధింపబడితిని ఇప్పుడు ఏమి చేయవలయును ? ఆ, తెలిసినది. మహేశ్వరుని అనుగ్రహముచే లభించిన మాయాపాశమోక్ష మంత్రము కలదు. దానిని జపించెదను. నీరు ఎచ్చట ? ఓ బ్రాహ్మణ కుమారుడా! కమండలములో యున్న నీటిని తీసుకొని రమ్ము.

**వృద్ధః – ఇమా ఆపః**

తా॥ ఇవిగో నీరు.

**(భీమసేనః ఆచమ్య, మంత్రం జప్త్వా మాయాం మోచయతి)**

(భీమసేనుడు ఆచమనము చేసి, మంత్రమును జపించి మాయను విడిపించును)

**ఘటోత్కచః – అయే పతితః పాశః । కిమిదానీం కరిష్యే । భవతు, భోః పురుష! పూర్వసమయం స్మర ।**

అ॥ అయే = ఆహో, పాశః = పాశము, పతితః = పడిపోయినది, ఇదానీం = ఇప్పుడు, కిం= ఏమి, కరిష్యే = చేయవలయును ? భవతు = కానిమ్ము, భో: పురుష = ఓ పురుషుడా! పూర్వసమయం = వెనుకటి వాగ్దానమును స్మర = స్మరింపుము.

తా॥ ఆహో! పాశము పడిపోయినది. ఇప్పుడు ఏమి చేయవలయును ? కానిమ్ము, ఓ పురుషుడా! వెనుకటి వాగ్దానమును స్మరింపుము.

**భీమసేనః – సమయః ఇతి । ఏష స్మరామి । గచ్ఛాగ్రతః ।**

తా॥ వాగ్దానమా ? ఇదిగో గుర్తువచ్చినది. ముందు నీవు పొమ్ము.

**(ఉభౌ పరిక్రామతః)**

(ఇద్దరు నడుచుచుందురు)

**వృద్ధః । పుత్రకాః! కిం కుర్మః । అయం గచ్ఛతి వృకోదరః ।**

తా॥ పుత్రులారా! ఏమి చేసెదము. ఈ భీముడు వెళ్లుచున్నాడు.

48.శ్లో॥ **ఆక్రమ్య రాక్షసమిమం జ్వలదుగ్రరూప । ముగ్రేణ బాహుబలవీర్యగుణేన యుక్తమ్ । ఏష ప్రయాతి శనకైరవధూయ శీఘ్రమాసార వర్షమివ గోవృషభః సలీలః ।**

అ॥ జ్వలత్ = మండుచున్న, ఉగ్ర = భయానకమైన, రూపం = ఆకారము కలిగిన, ఉగ్రేణ= భయంకరమైన, బాహుబలం వీర్యగుణేన = బాహుబలము, పరాక్రమములతోను, యుక్తం = కూడిన, ఇమం రాక్షసం = ఈ రాక్షసుని, ఆక్రమ్య = ఓడించి, ఏష = ఈ భీమసేనుడు, ఆసార వర్షం = జడివానను, శీఘ్రం = త్వరగా, అవధూయ = విదిలించుకొని, సలీలః = విలాసముతో కూడిన, గోవృషభః ఇవ = ఎద్దువలె, శనకైః = మెల్లగా, ప్రయాతి = వెళ్ళుచున్నాడు.

తా॥ జ్వలించుచున్న, భయానకమైన రూపము కలిగిన, భయంకరమైన బాహుబలముతోను పరాక్రమముతోను కూడిన ఈ రాక్షసుని ఓడించి, ఈ భీమసేనుడు జడివానను త్వరగా విదిలించుకొని విలాసముగా వెళ్ళుచున్న ఎద్దువలె మెల్లమెల్లగా వెళ్లుచున్నాడు.

**ఘటోత్కచః – ఇహ తిష్ఠ । త్వదాగమనం మంబాయై నివేదయామి ।**

అ॥ ఇహ = ఇక్కడ, తిష్ఠ = ఆగుము, త్వదాగమనం = నీ రాకను గూర్చి, అంబాయై = తల్లికి, నివేదయామి = నివేదించెదను.

తా॥ ఇక్కడ ఆగుము. నీ రాకను తల్లికి నివేదించెదను.

**భీమసేనః । బాఢమ్ । గచ్ఛ ।**

తా॥ మంచిది. వెళ్ళుము.

**ఘటోత్కచః –(ఉపసృత్య) అంబ! అభివాదయే ఘటోత్కచోఽహమ్ చిరాభిలషితో భవత్యా ఆహారార్థమానీతో మానుషః ।**

అ॥ అంబ = అమ్మా! అభివాదయే = నమస్కరించుచున్నాను, అహం = నేను, ఘటోత్కచః = ఘటోత్కచుడను, భవత్యా = నీచేత, ఆహారార్థం = ఆహారము

కొరకు, చిరాభిలషితః = చాలాకాలము నుండి కోరబడుచున్న, మానుషః = మానవుడు, ఆనీతః = తీసుకొని రాబడినాడు.

తా। (సమీపించి) అమ్మా! నమస్కరించుచున్నాను. నేను ఘటోత్కచుడను. నీవు ఆహారము కొరకు చాలా కాలమునుండి కోరుచున్న మానవుని తీసుకొని వచ్చితిని.

(ప్రవిశ్య)

(ప్రవేశించి)

హిడింబా – జాత ! చిరంజీవ । కీదృశో మానుష ఆనీతః ?

తా। పుత్రుడా! చిరకాలము జీవించుము. ఎటువంటి మానవుడు తీసుకొని రాబడెను ?

ఘటోత్కచః – భవతి ! వాఙ్మాత్రేణ మానుషో, న వీర్యేణ ।

అ। భవతి = తల్లీ!, వాఙ్మాత్రేణ = మాటచేతనే, మానుషః = మానవుడు, వీర్యేణ = పరాక్రమముచేత, న = కాదు.

తా। తల్లీ! మాటచేతనే మానవుడు. పరాక్రమము చేత కాదు.

హిడింబా – కిం బ్రాహ్మణః ?

తా। బ్రాహ్మణుడా ?

ఘటోత్కచః – న బ్రాహ్మణః

తా। బ్రాహ్మణుడు కాదు.

హిడింబా – అథవా స్థవిరః ?

తా। లేనిచో ముసలివాడా ?

ఘటోత్కచః – న వృద్ధః ।

తా। ముసలివాడు కాదు

హిడింబా – కిం బాలః ?

తా। బాలుడా ?

ఘటోత్కచః – న బాలః ।

తా। బాలుడు కాదు

హిడింబా – యద్యేవం,పశ్యామి తావదేనమ్

తా। అయినచో అతనిని చూచెదను.

(ఉభే పరిక్రామతః)

(ఇద్దరు నడుచుచుందురు)

హిడింబా – (విలోక్య) కి మేష మానుష ఆనీతః ?

తా। (చూచి) ఈ మానవుని తెచ్చితివా ?

ఘటోత్కచః – భవతి ! కోఽయమ్ ।

తా। పూజనీయురాలా! ఇతడెవడు ?

హిడింబా - దైవతం ఖల్వస్మాకమ్।

తా। మనకు దైవము కదా !

ఘటోత్కచః - ఆః కస్య దైవతమ్?

తా। ఆ, ఎవరికి దైవము ?

హిడింబా - తవ చ మమ చ।

తా। నీకు నాకు కూడా

ఘటోత్కచః - కః ప్రత్యయః ?

తా। నమ్మకమేది ?

హిడింబా - అయం ప్రత్యయః। జయత్వార్యపుత్రః

తా। ఇదిగో ఋజువు. ఆర్యపుత్రునకు జయమగుగాక !

భీమసేనః - (విలోక్య) కా పునరియమ్? అయే దేవీ హిడింబా!

తా। (చూచి) ఎవరీమె? దేవి హిడింబయా

49.శ్లో। అస్మాకం భ్రష్టరాజ్యానాం భ్రమతాం గహనే వనే।
జాతకారుణ్యయా దేవి! సంతాపో నాశిత స్త్వయా।

అ। భ్రష్టరాజ్యానాం = రాజ్యభ్రష్టులమైన, గహనే = దట్టమైన, వనే = అడవియందు, భ్రమతాం = సంచరించుచున్న, అస్మాకం = మాయొక్క, సంతాపః = దుఃఖము, దేవి= దేవీ! జాతకారుణ్యయా = దయకలిగిన, త్వయా = నీ చేత, నాశితః = పోగొట్టబడినది.

తా। దేవీ! రాజ్యభ్రష్టులమైన, దట్టమైన అడవియందు సంచరించుచున్న మా సంతాపము దయకలిగిన నీచే పోగొట్టబడినదికదా !

హిడింబే ! కిమిదమ్ ?

తా। హిడింబా ! ఇది ఏమిటి ?

హిడింబా - (కర్ణే) ఆర్యపుత్ర ! ఈదృశమివ

తా। (చెవిలో) ఆర్యపుత్రుడా! ఇది విషయము

భీమసేనః - జాత్యా రాక్షసీ, న సముదాచారేణ।

అ। జాత్యా = జాతిచే, రాక్షసీ = రాక్షసివి, న సముదాచారేణ = సదాచారముతో కాదు.

తా। జాతిచేతనే నీవు రాక్షసివిగాని సదాచారముతో కాదు.

హిడింబా - ఉన్మత్తక! అభివాదయ పితరమ్।

తా। పిచ్చివాడా! తండ్రికి నమస్కరింపుము.

ఘటోత్కచః -

50.శ్లో॥ అజ్ఞానాత్తు మయా పూర్వం యద్భవాన్నాభివాదితః ।
అస్య పుత్రాపరాధస్య ప్రసాదం కర్తుమర్హసి ॥

అ॥ పూర్వం = పూర్వము, అజ్ఞానాత్ = అజ్ఞానము వలన, భవాన్ = నీవు, మయా = నా చేత, న అభివాదితః = నమస్కరించబడలేదు. ఇతియత్ = అనునది ఏది కలదో, అస్య పుత్రాపరాధస్య = ఈ పుత్రుని నేరమునకు, ప్రసాదం = అనుగ్రహమును, కర్తుం= చేయుటకు, అర్హసి = తగుదువు.

తా॥ పూర్వము నేను అజ్ఞానము వలన నిన్ను నమస్కరించలేదు. ఈ పుత్రాపరాధమును క్షమించదగుదువు.

భోస్తాత! అహం స ధార్తరాష్ట్ర వనదవాగ్ని ర్ఘటో
త్కచోఽభివాదయే । పుత్రచాపలం క్షంతు మర్హసి ।

అ॥ భోఃతాత = ఓ తండ్రీ! ధార్తరాష్ట్రవన దవాగ్నిః = కౌరవులను వనమునకు దవాగ్నియగు, ఘటోత్కచః = ఘటోత్కచుడను, సః అహం = ఆ నేను, అభివాదయే = నమస్కరించుచున్నాను, పుత్రచాపలం = పుత్రుని చపలత్వమును, క్షంతుం = క్షమించుటకు, అర్హసి = తగుదువు.

తా॥ ఓ తండ్రీ! కౌరవులను అడవికి దవాగ్నియగు ఘటోత్కచుడను నేను నమస్కరించు చున్నాను. పుత్రుని చపలత్వమును క్షమించుము.

భీమసేనః – ఏహ్యేహి పుత్ర ! వ్యతిక్రమకృతం క్షాంతమేవ ।(పరిష్వజ్య) ధార్తరాష్ట్ర వన దవాగ్నిః । పుత్రాపేక్షీణి ఖలు పితృ హృదయాని । పుత్ర ! అతిబలపరాక్రమోభవ

అ॥ పుత్ర! = పుత్రుడా ! ఏహి ఏహి = రమ్ము రమ్ము, వ్యతిక్రమకృతం = చేయబడిన దోషము, క్షాంతం ఏవ = క్షమించబడినది. (పరిష్వజ్య = కౌగలించుకొని) ధార్తరాష్ట్రవనదవాగ్నిః = కౌరవులను అడవికి దవాగ్ని, పితృహృదయాని = తండ్రుల హృదయములు, పుత్రాపేక్షీణి ఖలు = పుత్రులయందు మక్కువ కలిగినవి కదా! పుత్ర = పుత్రుడా!, అతిబలపరాక్రమః = మిక్కిలి బలపరాక్రమములు కలవాడవు, భవ = అగుము.

తా॥ పుత్రుడా! రమ్ము రమ్ము. నీచే చేయబడిన అపరాధము క్షమించబడినది. (కౌగలించుకొని) ఇతడు కౌరవులను అడవికి దవాగ్ని వంటివాడు. తండ్రుల హృదయము పుత్రులయందు మక్కువ కలిగినవి కదా! పుత్రుడా! మిక్కిలి బలపరాక్రమములు కలిగినవాడవు కమ్ము.

ఘటోత్కచః – అనుగృహీతోఽస్మి

తా॥ అనుగ్రహించబడితిని.

వృద్ధః – ఏవం భీమసేన పుత్రోఽయం ఘటోత్కచః ।

తా॥ ఇటులనా ? ఇతడు భీమసేనుని పుత్రుడైన ఘటోత్కచుడా !

భీమసేనః - పుత్ర! అభివాదయాత్ర భవంతం కేశవదాసమ్ ।

అ॥ పుత్ర = పుత్రుడా! అత్ర భవంతం = పూజనీయుడైన, కేశవదాసం = కేశవదాసును, అభివాదయ = నమస్కరింపుము.

తా॥ పుత్రుడా! పూజనీయుడైన కేశవదాసుకు నమస్కరింపుము.

ఘటోత్కచః - భగవన్నభివాదయే ।

తా॥ పూజనీయుడా! నమస్కరించుచున్నాను.

వృద్ధః - పితృ సదృశ గుణ కీర్తిర్భవ ।

తా॥ తండ్రితో సమానమైన గుణములు కీర్తి కలవాడవు కమ్ము.

ఘటోత్కచః - అనుగృహీతోఽస్మి

తా॥ అనుగ్రహించబడితిని.

వృద్ధః - భో వృకోదర! రక్షితమస్మత్కులం స్వకులముద్ధృతం చ! గచ్ఛామస్తావత్।

అ॥ భో వృకోదర = ఓ భీమసేనుడా! అస్మత్కులం = మా కులము, రక్షితం = రక్షింపబడినది, స్వకులంచ = నీ కులము కూడ, ఉద్ధృతం = ఉద్ధరింపబడినది, గచ్ఛామః తావత్ = వెళ్ళుచున్నాము.

తా॥ ఓ భీమసేనుడా! మా కులము రక్షింపబడినది. నీ కులముకూడ సముద్ధరింపబడినది. పోయివచ్చెదము.

భీమసేనః -

51.శ్లో॥ అనుగ్రహాత్తు భవతః సర్వమాసీదిదం శుభమ్ ।
ఆశ్రమోఽదూరతోఽస్మాకం తత్రవిశ్రమ్య గమ్యతామ్ ।

అ॥ భవతః = నీయొక్క, అనుగ్రహాత్ = అనుగ్రహము వలన, ఇదం సర్వం = ఇది అంతయు, శుభం ఆసీత్ = శుభమయ్యెను, అస్మాకం = మాయొక్క, ఆశ్రమః = ఆశ్రమము, అదూరతః = దగ్గరలో యున్నది, తత్ర = అక్కడ, విశ్రమ్య = విశ్రమించి, గమ్యతాం = వెళ్ళబడుగాక!

తా॥ నీ అనుగ్రహము వలన యిదంతయు శుభమయ్యెను. మా ఆశ్రమము దగ్గరలోనే యున్నది. అక్కడ విశ్రమించి వెళ్ళుము.

వృద్ధః - కృతమాతిథ్యమనేన జీవిత ప్రదానేన । తస్మాత్ గచ్ఛామ స్తావత్ ।

అ॥ అనేన = ఈ, జీవితప్రదానేన = జీవితము నొసంగుటచేత, ఆతిథ్యం, ఆతిథ్యము, కృతం = చేయబడినది, తస్మాత్ = అందువలన, గచ్ఛామః తావత్ = వెళ్ళుచున్నాము.

తా॥ ఈ జీవితప్రదానముచే మాకు ఆతిథ్యము యివ్వబడినది. అందువలన పోయి వచ్చెదము.

భీమసేనః – గచ్ఛతు భవాన్ సకుటుంబః పునర్దర్శనాయ ।

తా॥ నీవు సకుటుంబముగా వెళ్ళెదవుగాక, తిరిగి దర్శనము లభించుగాక !

వృద్ధః – బాఢమ్ । ప్రథమః కల్పః ।

తా॥ మంచిది. మంచి సంకల్పము.

(నిష్క్రాంతః సకలత్రపుత్రః కేశవదాసః)

(కేశవదాసు భార్యాబిడ్డలతో నిష్క్రమించును)

భీమసేనః – హిడింబే ! ఇతస్తావత్ । వత్స ఘటోత్కచ ! ఇతస్తావత్ । తత్రభవంతం కేశవదాస మాశ్రమద్వార మాత్రమపి సంభావయిష్యామః ।

అ॥ హిడింబే = ఓ హిడింబా!, ఇతఃతావత్ = ఇటురమ్ము, వత్స = కుమారా!, ఘటోత్కచ = ఘటోత్కచుడా! ఇతఃతావత్ = ఇటు రమ్ము, తత్రభవంతం = పూజనీయుడైన, కేశవదాసం = కేశవదాసును, ఆశ్రమద్వారమాత్రం అపి = ఆశ్రమద్వారమువరకు, సంభావయిష్యామః = గౌరవించెదము.

తా॥ ఓ హిడింబా! ఇటు రమ్ము.కుమారుడా! ఘటోత్కచుడా! ఇటురమ్ము.పూజనీయుడైన కేశవదాసును ఆశ్రమము వరకు గౌరవముగా సాగనంపి వచ్చెదము.

52.శ్లో॥ యథా నదీనాం ప్రభవః సముద్రో యథాహుతీనాం ప్రభవో హుతాశః ।
యథేంద్రియాణాం ప్రభవం మనోఽపి తథా ప్రభుర్నో భగవానుపేంద్రః ।

అ॥ సముద్రః = సముద్రుడు, యథా = ఏవిధముగా, నదీనాం = నదులకు, ప్రభవః = ఆశ్రయుడో, హుతాశనః = అగ్ని, యథా = ఏ విధముగా, ఆహుతీనాం = ఆహుతులకు, ప్రభవః = ఆశ్రయమో, మనః = మనస్సు, యథా = ఏవిధముగా, ఇంద్రియాణాం = ఇంద్రియములకు, ప్రభవం = ఆశ్రయమో, తథా = ఆ విధముగా, భగవాన్ ఉపేంద్రః = భగవానుడగు మహావిష్ణువు, నః = మాకు, ప్రభుః = (ఆశ్రయము) ప్రభువు అగుచున్నాడు.

తా॥ సముద్రము ఎట్లు నదులకు ఆశ్రయమో, అగ్ని ఎట్లు ఆహుతులకు ఆశ్రయమో, మనస్సు ఎట్లు ఇంద్రియములకు ఆశ్రయమో, అట్లు పూజనీయుడైన (భగవానుడైన) మహావిష్ణువు మాకు ప్రభువగుచున్నాడు.

(నిష్క్రాంతాః సర్వే)

(అందరూ నిష్క్రమింతురు)

మహాకవియైన భాసునిచే రచించబడిన మధ్యమ వ్యాయోగము సమాప్తము.